శ్రీరస్తు

# రామాయణము

ఆతుకూరి మొల్లచే విరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

 [*Price Rs.* **1-8-0**.

# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్ర శ్రీమద్రామాయణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిది, 5 సంపుటములు ... | 15 | 0 |
| ఆంధ్రభాషార్ణవము ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనిమార్పు ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమన ... | 3 | 0 |
| కవిరాజమనోరంజనము ... | 1 | 4 |
| కృష్ణదండకము ... | 0 | 2 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము ... | 1 | 8 |
| కవిగజాంకుశము ... | 0 | 4 |
| కవిజనరంజనము ... | 0 | 12 |
| కృష్ణరాయవిజయము ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరనార్యునిది, కఠినపదములకు అర్థములు, కథాసంగ్రహము ... | 4 | 0 |
| కాశీఖండము, శ్రీనాథకవి ... | 3 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యకవి ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది ... | 0 | 12 |
| ,, శ్రీ గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది ... | 1 | 0 |
| గరుడాచలము - యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 4 |
| గీతమంజరి, శ్రీ చిలకమర్తిలక్ష్మీనరసింహము ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి ... | 1 | 12 |
| చెన్నబసవపురాణము ... | 2 | 8 |
| ఛందోదర్పణము, (అనంతునిఛందస్సు) ... | 2 | 0 |

శ్రీరస్తు

# రామాయణము

ఆతుకూరి మొల్లచే విరచితము

Presented by
Kavi Samrat
Nori Narasimhasastry,
Repalle



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

1952

# భూమిక

ఈరామాయణమును రచించినది ఆతుకూరి మొల్ల. ఈమె తండ్రి పేరు కేసనసెట్టి. ఈకవయిత్రి నివాసస్థానము నెల్లూరు మండలములోని గోపవరము అని గ్రంథమువలనఁ దెలియుచున్నది. ఈమె యేకాలమునం దుండెడిదో నిర్ణయించుటకుఁ దగినయాధారము లిప్పటికిని గనుపట్టవు. కాని తన గ్రంథములోని కవిస్తుతిలో శ్రీనాథుని నతనికిఁ బూర్వులను పేర్కొని యుంటచే శ్రీనాథునకుఁ దరువాతిది యనిమాత్రము తెలును. ఈమె కృష్ణదేవరాయలకాలములో నున్నట్లు చెప్పుదురు గాని నిర్ధారణ సేయుటకుమాత్ర మాధార మంతగా లేదు. అట్లైని యీమె పదునాఱవశతాబ్దములోనిది కావచ్చును. ఈమె యేవంశమునం బొడమెనో తెల్పుటకుఁ దగిన యాధారము లేకున్నను గులాల కులసంభూతురా లనిమాత్రము వాడుకలో నున్నది. స్త్రీలలోఁ గవిత్వముసెప్పువా రీమెకు ముం దున్నట్లు తోఁపదు. ఈమె కవిత్వమునందలి గుణదోషములను నేను రూపించి వ్రాయుట కంటె నాభారమును జదువరులకే వదలిన బాగుగ నుండు నని తోఁచి యట్లు చేసితిని.

ఈగ్రంథమును బ్రాచీనపుస్తకాధారమున మాతండ్రిగారొకశుద్ధప్రతి వ్రాయించియుండియు నేకారణముచేతనో ముద్రింపించి ప్రకటింపరైరి. ఇదివఱకీ మొల్లరామాయణ మెన్నోసారులు ముద్రింపఁబడినది. ఇటీవల నొకప్పుడు మాతండ్రిగారు

వ్రాయించియుంచిన వ్రాఁతప్రతితో నచ్చుపడియున్న పుస్తక మును సరిచూడఁగా నెన్నోస్థలములయందుఁ జాల వ్యత్యయ ములు గన్పట్టుటయే కాక యచ్చటచ్చటఁ గొన్నిపద్యములు గూడ నాయచ్చుపడ్డప్రతిలో లేవు. కాఁబట్టి శుద్ధముగా మా తండ్రిగారు వ్రాయించి యుంచినప్రతి యూరక పోనేల యనియు నిందలి విశేషములను జదువరులు దిలకింపవలయు ననియుఁ బ్రకృత మీరామాయణమును మఱిరెండు వ్రాఁతప్రతులతోఁ గూడ సంప్రతించి ముద్రింపించితిని.

చెన్నపురి.
25-10-1917.

ఇట్లు,
వావిళ్ల. వేంకటేశ్వరులు.



శ్రీరస్తు

# రామాయణము

## పీఠిక



శ్రీమహిమాభిరాముఁడు వ
సిష్ఠమహామునిపూజితుండు సు
త్రామవధూకళాభరణ
రక్షకుఁ డాశ్రితపోషకుండు దూ
ర్వామలసన్నిభాంగుఁడు మ
హాగుణశాలి దయాపరుండు శ్రీ
రాముఁడు ప్రోచు భక్తతతి
రంజిలునట్లుగ నెల్లకాలమున్. 1

ఉ. శ్రీనగమందిరుం డమరసేవితుఁ డర్ధశశాంకమౌళి స
న్మౌనిమనఃపయోజదిననాయకుఁ డబ్జభవామరేశ్వర
ధ్యానలసత్ప్రసన్నుఁ డతిధన్యుఁడు శేషవిభూషణుండు వి
ద్యానిధిమల్లికార్జునుఁడు తానిడుమాకుశుభంబులొప్పఁగన్. 2

ఉ. తెల్లనిపుండరీకముల తేజము మెచ్చనికన్నుదోయితో
నల్లనిశక్రనీలరుచి నవ్వెడుచక్కనిదేహకాంతితో

నల్లనఁబిల్లఁగ్రోవి కరమందలిసంజ్ఞల నింపు నింపఁగా
గొల్లతలన్ విశాళితగఁగొల్పెడుకృష్ణుఁడు ప్రోచుఁగావుతన్.

ఉ. మించి సమస్తలోకములు మిన్నక తాఁ దననేర్పు మీఱ ని
ర్మించి ప్రగల్భతన్ మెఱసి మేలును గీడును బ్రాణికోటి సే
వించఘటించుశాస్త్రములువేదములుం గొనియాడుచుండునా
కాంచనగర్భుఁ డిచ్చు నధికంబుగ నాయువు నీప్సితార్థముల్.

సీ. చంద్రఖండకలాపుఁ జారువామనరూపుఁ
గలితచంచలకర్ణుఁ గమలవర్ణు
మోదకోజ్జ్వలబాహు మూషకోత్తమవాహు
భద్రేభవదను సద్భక్తసదను
సన్మునిస్తుతిపాత్రు శైలరాడ్దౌహిత్రు
ననుదినామోదు విద్యాప్రసాదుఁ
బరశుపరాభ్యాసుఁ బాశాంకుశోల్లాసు
నురుతరఖ్యాతు నాగోపవీతు

తే. లోకవందితగుణవంతు నేకదంతు
నతులహేరంబు సత్కరుణావలంబు
విమలరవికోటితేజు శ్రీవిఘ్నరాజుఁ
బ్రథితవాక్ప్రౌఢికై యెప్డుఁ బ్రస్తుతింతు. 5

చ. కరిముఖుఁడుంగుమారుఁడువికారపుఁజేతలముద్దుసూపుచు
న్గురువులువాఱుచున్సరిగగుట్టలుదాఁటుచుఁజన్నుదోయితో
శిరములు రాయుచుం గబరిఁజేర్చినచంద్రునిఁ బట్టి తీయఁగాఁ
గరములఁ జాఁప నవ్వెడు జగమ్ములతల్లి శుభంబు లీవుతన్. 6

ఉ. సామజయుగ్మ మింపలరఁ జల్లనినీరు పసిండికుండలన్
వేమఱు వంచివంచి కడువేడుకతో నభిషిక్తఁ జేయఁగాఁ

దామరపువ్వుగద్దియ ముదంబుననుండెడిలోకమాత! మా
కామునితల్లి సంపద నఖండముగా! నిడు మాకు నెప్పుడున్.

ఉ. మేలిమిమంచుకొండ నుపమింపఁగఁజాలినయంచ నెక్కి వా
హ్యాళి నటించి వచ్చుచతురాస్యు నెదుర్కొని నవ్వు దేరఁగా
వాలికసోగకన్నుల నివాళి యొనర్చి ముదంబుఁ గూర్చువి
ద్యాలయవాణి శబ్దముల నర్థములన్ సతతంబు మాకిడున్. 8

సీ. సురసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి
నఖిలవేదాగమాభ్యాసు వ్యాసు
ఘోరాంధకారప్రభారవి భారవి
సత్కాంతిహిమకరశ్లాఘు మాఘు
వివిధకళాన్వితవిఖ్యాతి భవభూతిఁ
బ్రకటకార్యధురీణు భట్టబాణు
మానినీలోకసమ్మదముద్రు శివభద్రుఁ
గవితారసోల్లాసుఁ గాళిదాసు

తే. స్తుతగుణోద్ధాము నాచనసోము భీము
నవ్యమంజులవాగ్ధుర్యు నన్నపార్యు
రసికుఁ డైనట్టిశ్రీనాథు రంగనాథుఁ
దిక్కకవిరాజును నుతించి ధీని మించి. 9

క. తొల్లిటి యిప్పటి సత్కవి
వల్లభులను రసికవినుతవాగ్విభవకళా
మల్లులఁ గవితారచనల
బల్లిదు లైనట్టి ఘనుల భక్తిగఁ దలఁతున్. 10

క. గురులింగజంగమార్చన
పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్

గురుఁ డాతుకూరి కేసయ
వరపుత్త్రిని మొల్ల యనఁగ వఱలినదానన్. 11

సీ. దేశీయపదములు దెనుఁగులు సాంస్కృతుల్
సంధులు ప్రాజ్ఞులశబ్దవితతి
శయ్యలు రీతులుఁ జాటుప్రబంధంబు
లాయాసమాసంబు లర్థములును
భావార్థములుఁ గావ్యపరిపాకములు రస
భావచమత్కృతుల్ పలుకుసరవి
బహువర్ణములును విభక్తులు ధాతు ల
లంకృతిచ్ఛందోవిలక్షణములుఁ

తే. గావ్యసంపద క్రియలు నిఘంటువులును
గ్రమము లేవియు నెఱుఁగ విఖ్యాతగోప
వరపుశ్రీకంఠమల్లేశువరముచేత
నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చికొంటి. 12

క. చెప్పు మని రామచంద్రుఁడు
సెప్పించినపలుకుమీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర తప్పు లెంచకుఁడు కవుల్. 13

వ. అని మఱియును. 14

చ. వలిపపుసన్నపయ్యెదను వాసిగ గంపపుఁబూఁతతో డుతఁ
గొలఁదిగఁ గానవచ్చువలిగుబ్బచనుంగవరీవి నొప్పఁగాఁ
దెలుఁ గని చెప్పుచోటఁ గడు తేటలమాటలఁ గ్రొత్తరీతులం
బొలుపు వహింపకున్న మఱి పొందగు నే పటహావిశబ్దముల్

క. మును సంస్కృతములఁ జేటగఁ
దెనిఁగించెడిచోట నేమి దెలియక యుండన్
దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘన మగుసంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే. 16.

ఆ. తేనె సోఁక నోరు తీయన యగురీతి
తొడ నర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢ శబ్దములను గూర్చినకావ్యమ్ము
మూఁగ చెవిటివారిముచ్చ టగును. 17

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచి యై వీనుల
విం దై మఱి కానుపించు విబుధులమదికిన్. 18

వ. అని మఱియును. 19

క. ఆది రఘురాముచరితము
నాదరముగ విన్నఁ గ్రొత్త యై లక్షణసం
పాద మ్మై పుణ్యస్థితి
వేద మ్మై తోఁచకున్న వెల్లినె చెప్పన్. 20

ఉ. రాజితకీర్తి యైనరఘురామచరిత్రము మున్ గవీశ్వరుల్
తేజ మెలర్పఁ జెప్పి రని తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్పనే లనన్
భూజనకల్పకం బగుచు భుక్తికిముక్తికి మూల మైనయా
రాజును దైవ మైనరఘురాము నుతించినఁ దప్పు గల్గునే. 21

క. వారాంగన శ్రీరాముని
పే రిడి రాచిలుకఁ బిలిచి పెంపు వహించెన్

నేరుపు గలచందంబున
నారాముని వినుతి సేయ హర్షము రాదే. 22

క. నేరిచి పొగడినవారిని
నేరక కొనియాడువారి నిజకృప మనుపం
గారణ మగుటకు భక్తియె
కారణ మగుఁ గాని చదువు కారణ మగునే. 23

ఉ. సల్లలితప్రతాపగుణసాగరుఁడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైనరామనరపాలకునిన్ స్తుతిసేయుజిహ్వకున్
జిల్లరరాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చ పుట్టునే
అల్లము బెల్లముం దినుచు నప్పటికప్పటి కాస సేయునే. 24

వ. అని వితర్కించి ముదంబున నిష్టదేవతాప్రార్థనంబును బురా
తనకవీంద్రస్తుతియునుం జేసి నాచేయం బూనిన మొల్ల
రామాయణమునకుఁ గథావిధానం బెట్టి దనిన. 25

—

# బాలకాండము

సీ. సరయూనదీతీరసతతసన్మంగళ
ప్రాభవోన్నతమహావైభవమ్ము
కనకగోపురహర్మ్యఘనకవాటోజ్జ్వల
త్ప్రాకారగోపురశ్రీకరమ్ము
గజవాజిరథభటగణికాతపత్రచా
మరకేతుతోరణమండితమ్ము
ధరణీవధూటికాభరణవిభ్రమరేఖ
దరిసించుమాణిక్యదర్పణమ్ము
తే. భానుకులదీపరాజన్యపట్టభద్ర
భాసినవరత్నఖచితసింహాసనమ్ము
నాఁగ నుతి కెక్కు మహిమ ననారతమ్ము
ధర్మనిలయమ్ము మహి నయోధ్యాపురమ్ము. 1

సీ. మదనాగయూథసమగ్రదేశము గాని
కుటిలవర్తనశేషకులము గాదు
ఆహవోర్వీజయహరినివాసము గాని
కీశసముత్కరాంకితము గాదు
సుందరస్యందనమందిరం బగుఁ గాని
సంతతమంజులాశ్రయము గాదు

మోహనగణికాసమూహగేయము గాని
యూధికానికరసంయుతము గాదు
తే. సరస సత్పుణ్యజననివాసమ్ము గాని
కఠిననిర్దయదైత్యసంఘమ్ము గాదు
కాదు కాదని కొనియాడఁ గలిగినట్టి
పురవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము. 2
సీ. భూరివిద్యాప్రౌఢి శారదాపీఠ మై
గణుతింప సత్యలోకమ్మువోలె
మహనీయగుణసర్వమంగళావాసమై
పొగడొందుకైలాసనగమువోలె
లలితసంపచ్ఛాలిలక్ష్మీనివాస మై
యురవైనవైకుంఠపురమువోలె
విరచితప్రఖ్యాతహరిచందనాఢ్యమై
యారూఢి నమరాలయమ్మువోలె
తే. రాజరాజనివాస మై తేజరిల్లి
నరవరోత్తరదిగ్భాగనగరివోలె
సకలజనములు గొనియాడ జగములందుఁ
బొలుపుమీరును సాకేతపురవరమ్ము. 3
క. ఇమ్ముల నప్పురి వప్రము
కొమ్ములపై నుండి పురముకొమ్మలు వేడ్కన్
దమ్ములచుట్టము పదజల
జమ్ములు పూజింతు రొగి నజస్రముఁ బ్రీతిన్. 4
క. పరువున మురువై యుండును
సురపురమునఁ గల్పతరులు చూపఱ కింపై

పరువున మరువై యుండును
దురగంబు లయోధ్యఁ గలప్రతోళికలందున్. 5

క. దానగుణమ్మున సురపురి
నేనాఁడును నమరరత్న మెన్నిక కెక్కున్
దానగుణంబున మిక్కిలి
యేనుఁగు లాపురములోన నెన్నిక కెక్కున్. 6

క. కవిగురుబుధమిత్రాదులు
వివిధార్చనలను సురపురి వెలయుదు రెలమిన్
గవిగురుబుధమిత్రాదులు
వివిధార్చనలం బురమున వెలయుదు రెపుడున్. 7

క. భోగానురాగసంపద
భోగులు వర్తింతు రందు భూనుతలీలన్
భోగానురాగసంపద
భోగులు వర్తింతు రిందు భూనుతలీలన్. 8

సీ. ప్రకటానురాగసంపన్ను లౌదురు గాని
రమణీయరుక్మ కారకులు గారు
శుభపవిత్రోజ్జ్వలసూత్రధారులు గాని
టక్కరిహాస్యనాటకులు గారు
ఉభయసంధ్యాదివిధ్యుక్తకర్ములు గాని
చర్చింపఁగా నిశాచరులు గారు
తిలకించి చూడ సద్ద్విజు లౌదురే కాని
తలఁపంగఁ బక్షిజాతములు కారు

తే. బాడబులు గాని యగ్నిరూపములు గారు
పండితులు గాని విజ్ఞులపగిదిఁ గారు

ధీవరులు గాని జాతినిందితులు గారు
పరమపావను లాపురి ధరణిసురులు. 9

ఉ. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమకేళియందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారు లందఱున్.

సీ. తగ దానవిఖ్యాతి ధరఁ గుబేరులు గాని
సతతాంగకుష్ఠపీడితులు గారు
నిర్మలసత్కీర్తి ధర్మసూతులు గాని
చర్చింప ననృతభాషకులు గారు
ప్రకటవిభూతిసౌభాగ్యరుద్రులు గాని
వసుధపై రోషమానసులు గారు
కమనీయగాంభీర్యఘనసముద్రులు గాని
యతులితభంగసంగతులు గారు

తే. వర్తకులు గాని పశు లెవరుసఁ గారు
భోగులే గాని పాము లెప్పుడును గారు
సరసులే కాని కొలఁకులజాడఁ గారు
వన్నె కెక్కినయప్పురివైశ్యు లెల్ల. 11

క. పంటల భాగ్యము గలరై
పంటలపైఁ బంట లమర బ్రతుకుదు రెపుడున్
బంటలుఁ బాడియుఁ గలయా
పంటలు మొదలైనకాఁపుఁబ్రజ లానగరిన్. 12

సీ. కలికిచూపులచేతఁ గరఁగింప నేర్తురు
బ్రహ్మచారుల నైన భ్రాంతి గొలిపి

మృదువచోరచనల వదలింప నేర్తురు
ఘనమునీంద్రుల నైనఁ గచ్ఛడములు
వలపులు పైఁజల్లి వలపింప నేర్తురు
సన్యాసులను నైనఁ జలముపట్టి
సురతబంధమ్ములఁ జొక్కింప నేర్తురు
వ్రతములు గైకొన్నయతుల నైన
తే. అచల మెక్కింప నేరుతు రౌషధముల
మరులు గొలుపంగ నేర్తురు మంత్రములను
ధనము లంకింప నేర్తురు తక్కుసేసి
వాసి కెక్కినయప్పురివారసతులు. 13
సీ. శారద గాయత్రి శాండిల్య గాలవ
కపిల కౌశిక కులఖ్యాతి గలిగి
మదన విష్వక్సేన మాధవ నారద
శుక వైజయంతి కార్జునులు గలిగి
చంద్రార్క గుహా గిరిసంభవ జయ వృష
కుంభ బాణాదులఁ గొమరు మిగిలి
సుమన ఐరావత సురభి శక్రామృత
పారిజాతముల సొంపారఁ గలిగి
తే. బ్రహ్మనిలయమ్ము వైకుంఠపట్టణమ్ము
నాగకంకణుశైలమ్ము నాకపురము
లలితగతిఁ బోలి యేవేళఁ దులను దూఁగి
ఘనత నొప్పారు నప్పురివనము లెల్ల. 14
చ. కనకవిలాసకుంభములు గబ్బికుచంబులలీలఁ జిత్రకే
తనములు పైఁటకొంగులవిధంబునఁ గ్రాల గవాక్షముల్ప్రహీ

గనుఁగవయట్లపా ల్వెసఁగఁగా భువిభోగులు మెచ్చ భోగినీ
జనములరీతిఁ జెల్వమరు సౌధనికాయము పాయ కప్పురిన్.

తే. మకరకచ్ఛపశంఖపద్మములు గలిగి
ధనదునగరమ్ముపైఁ గాలుద్రవ్వుచుండు
సరసమాధుర్యగాంభీర్యసరణిఁ బేర్చి
గుఱుతు మీఱిన యప్పురికోలఁకు లెల్ల. 16

తే. అమృతధారాప్రవాహమ్మునందు నెపుడు
నొక్క ధేనువు దివి నున్న నుచిత మగునె
అమృతధారాప్రవాహమ్మునందు నెపుడుఁ
బెక్కు ధేనువు లప్పురిఁ బేరు నొందు. 17

క. ఈకరణి సకలవిభవ
శ్రీకర మయి తాఁ బ్రసిద్ధిఁ జెలఁగుచు మహిమన్
నాకపురితోడ నొఱయుచు
సాకేతపురమ్ము వెలయు జగము నుతింపన్. 18

వ. అట్టిమహాపట్టణంబున కధీశ్వరుం డెట్టివాఁ డనఁగ. 19

సీ. తనకీర్తికర్పూరతతిచేత వాసించెఁ
బటుతర బ్రహ్మాండభాండ మెల్లఁ
దనశౌర్యదీప్తిచే నినబింబ మనయంబుఁ
బగ లెల్ల మాఁగుడువడఁగఁ జేసెఁ
దనదానవిఖ్యాతి ననుదినంబును నర్థి
దారిద్ర్యములు వెళ్లఁ బాఱఁ దఱిమెఁ
దననీతిమహిమచే జనలోక మంతయుఁ
దగిలి సంతతమును బొగడఁ దనరెఁ

తే. భళిర ! కొనియాడఁ బాత్రమై పరఁగినట్టి
వైరినృపజాలమేఘసమీరణుండు
దినకరాన్వయపాథోధివనజవైరి
నిశితకౌక్షేయకకరుండు దశరథుండు. 19

సీ. పాలింపఁ డవినీతిపరుల మన్ననఁ జేసి
పాలించు సజ్జనప్రతతి నెపుడు
మనుపఁ డెన్నఁడు జోరులను గారవము చేసి
మనుచు నాశ్రితకోటి ఘనము గాఁగ
వెఱ పెఱుంగఁడు వైరివీరులఁ బొడఁగన్న
వెఱచు బొంకేయెడ దొరలునో యని
తలఁకఁ డర్థివ్రాతములు మీఱి పైకొన్నఁ
దలఁకు ధర్మమ్మెందుఁ దప్పునో యని
తే. సరవిఁ బోషింపఁ డరిగణాపట్క మెపుడు
వెలయఁ బోషించు నిత్యమ్ము విప్రవరుల
భాస్కరాన్వయతేజోవిభాసితుండు
మానధుర్యుండు దశరథక్ష్మావరుండు.
సీ. కనఁ గోరఁ డొకనాఁడుఁ గన్నులఁ బరవధూ
లావణ్యసౌభాగ్యలక్షణములు
వినఁ గోరఁ డొకనాఁడు వీనుల కింపుగాఁ
గొలుచువారలమీఁదికొండెములను
చిత్తంబు వెడలించి జిహ్వాగ్రమునఁ గోరి
పలుకఁడు కాఠిన్యభాషణములు
తలఁపఁ డించుక యైన ధనకాంక్ష నేనాఁడు
బంధుమిత్రాశ్రితప్రతతిఁ జెఱుప

తే. సతతగాంభీర్యధైర్యభూషణపరుండు
వార్త కెక్కినరాజన్యవర్తనుండు
సకలభూపాలజనసభాసన్నుతుండు
ధర్మతాత్పర్యనిరతుండు దశరథుండు. 21

సీ. విరహాతిశయమున వృద్ధిఁబొందఁగ లేక
విషధరుండును గోఁజి విషముఁ బూనె
తాపంబు క్రొవ్వెంచి తరియింప నోపక
పలుమాఱుఁ గడగండ్లఁ బడియెఁ గరులు
కందర్పశరవృష్టి నంద నోపక ఘృష్టి
వనవాసమునఁ గ్రుస్సి వనరు సూపె
దీపించి వల పాఁప నోపక కూర్మంబు
కుక్షిలోపలఁ దలఁ గ్రుక్కికొనియె
తే. కుంభినీకాంత తమమీఁదికూర్మి విడిచి
ప్రకటరాజన్యమస్తకాభరణముకుట
చారుమాణిక్యదీపితచరణుఁడైన
దశరథాధీశుభుజపీఠిఁ దగిలినంత. 22

క. ఆరాజురాజ్యమందలి
వారెల్లను నిరతధర్మవర్తను లగుచున్
భూరిశ్రీవిభవంబుల
దారిద్ర్యం బెఱుఁగ రెట్టితఱి నేనాఁడున్. 23

వ. ఇట్టిమహాధైర్యసంపన్నుండును మహైశ్వర్యధుర్యుండును నగుదశరథమహారాజు సకల సామంతరాజలోకపూజ్యమానుండగుచుఁ బ్రాజ్యం బగురాజ్యంబు నేలుచు నొక్కనాఁడు.

సీ. సంతానలబ్ధికై చింతించి చింతించి
శిష్టవర్తనుఁ డౌవసిష్ఠుఁ జూచి
తనకోర్కి వినుపింప విని మునిసింహుండు
పలికె ఋశ్యశృంగు నెలమిఁ దేర
ఘనుఁ డాతఁ డొగిఁ బుత్రకామేష్టి యనువేర
యాగమ్ముఁ గావింప నందువలన
వినుతికెక్కఁగఁ జాలుతనయులు గలుగుట
సిద్ధము నామాట బుద్ధిలోన
తే. నిలుపు మని చెప్ప నారాజు నెమ్మితోడ
సకుటిలాత్మకు నావిభాండకునితనయు
చెలిమి రావించి పుత్రకామేష్టి యనెడి
జన్న మొనరించు చున్నట్టి సమయమునను. 25
ఉ. రావణుచేతిబాధల నిరంతరముం బడి వేఁగి మూఁక లై
దేవతలెల్ల నిప్పటికిఁ దెల్లముగా నెఱిఁగింప వారి రా
జీవతనూజుఁ డున్నెడకు శీఘ్రము తోడ్కొనిపోయి చెప్పనా
దేవుఁడు విష్ణుసన్నిధికి దిగ్గనఁ జేకొనిపోయి యచ్చటన్. 26
వ. అప్పురాణపురుషోత్తముం గాంచి నమస్కరించి యింద్రాది
దేవతలం జూపి బ్రహ్మ యిట్లని విన్నవించె. 27
ఉ. రావణుఁ డుగ్రుఁ డై తనపరాక్రమశక్తిని వీరసంపదల్
వావిరిఁ గొల్లలాడి త్రిదివంబును బాడుగఁ జేయ నేఁడు దే
వావలి దీనభావమున నక్కడ నుండఁగ నోడి భీతిచే
దేవరఁ గాన వచ్చె నిఁక దేవరచిత్తము వీరిభాగ్యమున్. 28
వ. అని విన్నవించిన విని వనరుహాలోచనుండు దయాయత్త
చిత్తుం డై యనిమిషనాయకునిఁగూర్చి యిట్లానతిచ్చె. 29

తే. వనజగర్భునిఁగూర్చి రావణుఁడు మున్ను
తపము చేసిన వర మిచ్చుతఱిని దనకు
నేరిచే జావు లే కుండఁ గోరువాఁడు
నరులవానరులను జెప్ప మఱచినాఁడు. 31

వ. అక్కారణంబునం జేసి.

తే. వనరు గలిగెను మనకు రావణునిఁ జంప
వినుఁడు మీరెల్ల నామాట వేడ్కమీఱ
దశరథుం డనురాజు సంతానకాంక్ష
నొనర జన్నంబు గావించుచున్నవాఁడు. 32

క. ధరణీపతి యగుదశరథ
నరనాయకునింటఁ బుట్టి నరరూపమునం
బెరిఁగెద నే నిక మీరును
సురకంటకుమీఁద లావు సూపుటకొఱకై. 33

క. కొందఱు కపివంశంబునఁ
గొందఱు భల్లుకకులమున గురుబలయుతులై
యందఱు నన్నితెఱంగుల
బృందారకులార! పుట్టి పెరుఁగుఁడు భువిపై. 34

వ. అని కృపాధురీణుం డైననారాయణుఁ డానతిచ్చిన విని వన జాసనాదిదేవతానికరం బవ్వనజోదరునిపాదారవిందమ్ములకు వందనమ్ము లాచరించి నిజనివాసమ్ములకుం జని రయ్యవసరమ్మున. 35

మ. ఇల సాకేతనృపాలశేఖరుఁడు దా హేలావిలాసంబుతో
ఫలకాంక్షఁ గ్రతువుం బొనర్చినయెడన్ బంగారుపాత్రమ్ములో
పల దుగ్ధాన్నము చాలనించుకొని తాఁ బ్రత్యక్షమైనిల్చి ని
ర్మలతేజంబునఁ బావకుండనియెఁ బ్రేమన్ మంజువాక్యంబులన్.

క. భూపాల నీదుభార్యల
కీపాయస మారగింప నిమ్మీ తనయుల్
శ్రీపతిపుత్రసమానులు
రూపసు లుదయింతు రమితరూపస్ఫూర్తిన్. 37

వ. అని చెప్పి యప్పాయసపాత్రంబు చేతి కిచ్చిన. 38

ఆ. పాయసమ్ము రెండుభాగముల్ గావించి
యగ్రసతుల కీయ నందులోన
సగము సగము దీసి ముగుద సుమిత్రకు
నొసఁగి రంత నామె మెసవెఁ బ్రీతి. 39

వ. అంతం గొన్నిదినంబులకుఁ గౌసల్యాకైకేయీసుమిత్రలు
గర్భవతు లై యొప్పారుచుండ. 40

సీ. ధవళాక్షు లనుమాట తథ్యంబు గావింపఁ
దెలు పెక్కి కన్నులు తేట లయ్యె
నీలకుంతల లని నెగడినయామాట
నిలుపంగ నెఱులపై నలుపు సూపె
గురుకుచ లనుమాట సరవి భాషింపంగఁ
దోర మై కుచముల నీరువట్టె *
మంజుభాషిణు లనుమాట దప్పక యుండ
మెలఁతలపలుకులు మృదువు లయ్యెఁ

తే. గామిను లటంట నిక్కమై కాంతలందు
మీఱి మే లై నరుచులపైఁ గోరికయ్యె
సవతిపోరనఁ దమలోన సారె సారె

---

శ్రీ. కం. వీరేశలింగముపంతులవారిప్రతిలోని పాఠములు.

*మందయాన లనంగ నామైనయమ్మాట
నిక్కంబుగా మాంద్యమెక్కెనడల. .

కోకిలింతలు బెట్టుచిట్టుములుఁ బుట్టె. 41

వ. మఱియును. 42

సీ. తనుమధ్య లనుమాటఁ దప్పింపఁ గాఁబోలుఁ
 బొఱి లేక నడుములు పొదలఁ జొచ్చెఁ
గుచములు బంగారుకుండలో యనుమాట
 కల్లగా నగ్రముల్ నల్లనయ్యెఁ *
జంద్రాస్య లనుమాట సరవి మాన్పఁగఁ బోలుఁ
 గళలవిలాసమ్ము పలుచ నయ్యె
సుందరు లనుమాట సందియమ్ముగఁ బోలు
 గర్భభారమ్ములఁ గాంతి దప్పె
తే. ననుచుఁ గనుఁగొన్నవా రెల్ల నాడుచుండఁ
గట్టుచీరెల వ్రేకంబు పుట్టుచుండ
నాసతులఁ జూచి యందఱు నలరుచుండఁ
గాంతలకు నప్డు గర్భముల్ గానుపించె. 43

వ. ఇట్లు దుర్భరంబు లైనగర్భంబులు దాల్చినకౌసల్యాదికాంతాత్రయమ్మును జైత్రమాసమ్మున శుక్లపక్షమ్మున నవమీభానువాసరమ్మునఁ బునర్వసునక్షత్రంబునఁ గర్కాటకలగ్నంబున శ్రీరామభరతలక్ష్మణశత్రుఘ్నులం గాంచినం దదనంతరంబున దశరథుండు యథోచితకర్తవ్యంబులు జరపి యప్పుడి దినంబులు నరిష్టంబు లేక ప్రతిదినవర్ధమాన మగుచున్న కుమారచతుష్టయంబునకుఁ గాలోచితంబు లగుచౌలోపనయనాదికృత్యంబులు గావించి వెండియు విద్యాప్రవీణు లగునట్టు లొనర్చి గజాశ్వరథారోహణంబులు నేర్పి

* ముకురకపోలలు ముగుద లనెడుమాట, గల్లగాఁ జెక్కులు వెల్ల నయ్యె.

ధనుర్వేదపారగులం గావించి పెంచుచున్నసమయమ్మున. 44

సీ. ఒకనాఁడు శుభగోష్ఠి నుర్వీశ్వరుఁడు మంత్రి
హితపురోహితులును నెలమిఁ జేరి
బంధువర్గము రాయబారులుఁ జారులుఁ
బరిచారకులు నెల్ల సరవిఁ జేరి
గాయకులును భృత్యగణమును మిత్రులు
సతులును సుతులును జక్క నలరి
సరసులు జతురులుఁ బరిహాసకులుఁ గళా
వంతులుఁ గడు నొక్కవంకఁ జేరి

తే. కొలువఁ గొలువున్నయెడ వచ్చి కుశికపుత్రుఁ
డర్థి దీవించి తా వచ్చినట్టికార్య
మధిపునకుఁ జెప్ప మదిలోన నాత్రపడుచు
వినయ మొప్పార నిట్లని విన్నవించె. 45

క. రాముఁడు దనుజులతో సం
గ్రామము సేయంగఁ గలఁడె కందుగదా! నే
నే మిమ్ముఁ గొలిచి వచ్చెద
నోమునిరాజేంద్ర! యరుగు ముచితప్రౌఢిన్. 46

మ. అనినం గౌశికుఁ డాత్మ నవ్వి వినుమయ్యా! రాజ! నీచేతఁగా
దనరా దైనను రాక్షసుల్ విపులగర్వాటోపబాహాబలుల్
ఘనుఁ డీరాముఁడు దక్క వారిఁ గెలువంగారాదు పిన్నంచునీ
వనుమానింపక పంపుమింకఁ గ్రతురక్షార్థంబు భూనాయకా!

వ. అని ప్రియోక్తులు వలుకుచున్న విశ్వామిత్రునకు మిత్రకుల
పవిత్రుం డైనదశరథుండు మాఱాడ నోడి యప్పుడు. 48

క. మునినాథువెంట సుత్రా

ముని నలజడి వెట్టుచున్న మూర్ఖులపై రా
ముని సౌమిత్రిని వేసన
మ్మునితో నానందవార్ధి మునుఁగుచుఁ బనిచెన్. 49

మత్త. వారిఁ దోడ్కొని కౌశికుం డట వచ్చునయ్యెడ ఘోరకాం
తారమధ్యమునందు నొక్కతె దైత్యకామిని భీకరా
కార మొప్పఁగ నట్టహాసవికాస మేర్పడ రాఁగ నా
క్రూరరాక్షసిఁ జూచి యమ్మునికుంజరుం డొగి రాఘునిన్.

క. తాటక వచ్చిన దదిగో
నాటగ నాఁడు దని మేల మాడక నీ వీ
పాటి పడ నేయు మని తన
చాటున భయపడెడి రామచంద్రున కనియెన్. 51

వ. ఇట్లు చెప్పిన యీమునిచంద్రునిపల్కు లాలించి రామ
చంద్రుండు తనయంతరంగమ్మున నిట్లని వితర్కించె. 52

క. ఈయాఁడుదానిఁ జంపఁగ
నాయమ్మున కేమిగొప్ప నగరే వీరుల్
చీ యని రోయుచు నమ్ముని
నాయకుభయ మెఱిఁగి తనమనమ్మున నలుకన్. 53

క. వ్రేటు గొని రామచంద్రుఁడు
సూటిగ నొకదిట్టకోల సురలు నుతింపన్
ఘోటకసమవక్షస్స్థలఁ
దాటక నత్యుగ్రలీల ధరపైఁ గూల్చెన్. 54

వ. ఇట్లు డాటకం గీటణంచినయంత నమ్మునీంద్రుండు మేటి
సంతోషమ్మున రామునిం గొనియాడుచు నశ్రమంబున నిజా
శ్రమంబున కేతెంచి రామసౌమిత్రులసాయంబున జన్నంబు
సేయుచున్న సమయంబున. 55

క. ఆకాశవీథి నెలకొని
రాకాసులు గురిసి రమితరక్తముఁ బలలం
బాకౌశికుయజ్ఞముపై
భీకరముగ మునిగణంబు భీతిం బొందన్. 56

ఉ. అంబరవీథి నిల్చి త్రిదశాంతకు లెంతయు నేచి రక్తమాం
సంబులు గాధినందనునిజన్నముపైఁ గురియంగ నంతలో
నంబరరత్నవంశకలశాంబుధిచంద్రుఁడు రామచంద్రుఁ డు
గ్రంబుగఁ ద్రుంచెఁ జండబలగర్వులఁ దమ్ముఁడుఁ దాను నొక్కటై.

వ. ఇట్లు రామచంద్రుండు సాంద్రప్రతాపంబు మించ నింద్రా
రులఁ ద్రుంచిన నమ్మునిచంద్రుఁడు నిర్విఘ్నంబుగా జన్నం
బొనర్చి రామసౌమిత్రులం బూజించె నట్టిసమయమ్మున. 58

క. ధరణీసుత యగుసీతకుఁ
బరిణయ మొనరింప జనకపార్థివుఁ డిల భూ
వరసుతుల రం డని స్వయం
వర మొగిఁ జాటించె నెల్లవారలు వినఁగన్. 59

వ. ఇట్లు స్వయంవరమహోత్సవఘోషంబున సంతోషమ్మునొంది
విశ్వామిత్రుండు రామసౌమిత్రుల మిథిలానగరంబునకుఁ
దోడ్కొని చనుచుండుమార్గంబున. 60

క. ముదితాపసివెనువెంటను
వదలక చనుదెంచునట్టివడి రామునిశ్రీ
పదరజము సోకి చిత్రం
బొదవఁగఁ గనుపట్టె నెదుట నొకయుపల మటన్. 61

క. పద నై యొప్పిన మై కడుఁ
గదలుచు బంగారుపూదె కరఁగినరీతిం

బొదలుచు లావణ్యస్థితి
సుదతిగఁ జూపట్టి నిలిచె సురుచిరలీలన్. 62

ఉ. ఆమునివల్ల భంగు గొనియాడుచుఁ బాడుచు వేడ్కతోడ శ్రీ
రాముని జూచి యిట్లనియె రామ! భవత్పదధూళిసోఁకి యీ
భామిని రాయి మున్ను కులపావన చూడఁగఁ జిత్రమయ్యె నీ
నామ మెఱుంగువారలకు నమ్మఁగవచ్చును భుక్తిముక్తులున్. 63

వ. అని యక్కాంతారత్నంబు పూర్వవృత్తాంతం బంతయు నెంతయు సంతసమ్మున నమ్మనుజేంద్రనందనుల కెఱింగించుచు మిథిలానగరంబునకుం జనియె నచ్చట. 64

సీ. ద్రవిడ కర్ణాటాంధ్ర యవన మహారాష్ట్ర
రాజకుమారులు తేజ మలరఁ
బాండ్య ఘూర్జర లాట బర్బర మళయాళ
భూపనందనులు విస్ఫూర్తి మీఱ
గౌళ కేరళ సింధు కాశ కోసల సాళ్వ
ధరణీశపుత్త్రులు సిరి వెలుంగ
మగధ మత్స్య కళింగ మాళవ నేపాళ
నృపతనూభవులు నెన్నికకు నెక్క
తే. మఱియు నుత్కల కోంకణ మద్ర పౌండ్ర
వత్స గాంధార సౌరాష్ట్ర వంగ చోళ
రాజ్యముల నొప్పుచున్న రాజసుతులు
వచ్చి రక్కామినీస్వయంవరమునకును. 65

ఉ. కొందఱు పల్లకీల మఱికొందఱు తేరుల నందలంబులం
గొందఱు కొందఱశ్వములఁ గొందఱుమత్తగజేంద్రసంఘము
న్గొందఱు స్వర్ణడోలికలఁ గోరిక నెక్కి నృపాలనందనుల్

సందడిఁ గాఁగ వచ్చిరి బుజంబు బుజంబును ద్రోపులాడఁగన్.

వ. అట్టిసమయంబున.

చ. గురుభుజశక్తి గల్గుపదికోట్లజనంబులఁ బంప వారు నా
హరునిశరాసనంబుఁ గొనియాడుచుఁ బాడుచుఁ గొంచువచ్చిను
స్థిరముగ వేదిమధ్యమునఁ జేర్చిన దానికి ధూపదీపముల్
విరులును గంధ మక్షతలు వేడుక నిచ్చిరి చూడనొప్పఁగన్.

వ. అట్టిసమయంబున జనకభూపాలుండు రాజకుమారులం గనుం
గొని యిట్లనియె. 69

ఉ. కొంకక సావధానమతిఁ గూర్చి వినుం డిదె మత్కుమారికై
యుంకువ నేసినాఁడ వివిధోజ్జ్వల మైనధనంబుఁ గాన నీ
శంకరుచాప మెక్కిడిన సత్త్వఘనుం డగువాని కిత్తు నీ
పంకజనేత్ర సీత నరపాలకులార! నిజంబు సెప్పితిన్. 70

ఆ. అనుచుఁ బలుకుచున్న యవనీశతిలకుని
వాక్యములకు నుబ్బి వసుమతీశ
సుతులు దాముతామె మతిలోనఁ జెలఁగుచు
దగ్గఱంగఁ బోయి ధనువుఁ జూచి. 71

క. విల్లా యిది కొండా యని
తల్లడపడి సంశయంబు తలకొన మదిలో
బల్లిదు లగునృపనందను
లెల్లరు దౌదవుల నుండి రెంతయు భీతిన్. 72

క. కొందఱు డగ్గఱ నోడిరి
కొందఱు సాహసము చేసి కోదండముతో
నందంద పెనఁగి పాఱిరి
సందుల గొందులను దూఱి సత్త్వము లేమిన్. 73

సీ. గాలిఁ దూలినరీతిగా నెత్తఁ జాలక
తముఁ డా మె సిగ్గునఁ దలను వంచి
కౌఁగిలించిన లోను గాక వెగ్గల మైన
భీతిచే మిక్కిలి బీరువోయి
కరముల నందంద పొరలించి చూచినఁ
గదలక యున్నఁ జీకాకునొంది
బాషాణ మున్నట్టిపగిది మార్దవ మేమి
గానరాకుండినఁ గళవళించి
తే. రాజసూనులు కొందఱు తేజ ముడిగి
జగతి రాజుల మోసపుచ్చంగఁ దలఁచి
జనకుఁ డీమాయఁ గావించెఁ జాలు ననుచుఁ
దలఁగి పోయిరి దవ్వుగా ధనువు విడిచి. 74
సీ. ఇది పర్వతాకార మీవిల్లు కను విచ్చి
తేఱి చూఁడగ రాదు దేవతలకు
నటుగాక మును శేషకటకునిధను వంట
హరుఁడె కావలెఁ గాక హరియుఁ గాక
తక్కినవారికిఁ దర మె యీకోదండ
మెత్తంగఁ దగుచేవ యెట్లు గలుగు
దీని డగ్గఱ నేల దీని కోడఁగ నేల
పరులచే నవ్వులు పడఁగ నేల
తే. గుఱుతు సేసియుఁ దమలావుకొలఁదిఁ దా మె
తెలియవలెఁ గాక యూరక తివుర నేల
యొరుల సొమ్ములు తమ కేల దొరకు ననుచు
దలఁగి పోయిరి రాజనందనులు గనుచు. 75

వ. అంత విశ్వామిత్రమునీంద్రుండు రామచంద్రునిముఖావలోకనంబుఁ జేసిన. 76

చ. కదలకుమీ ధరాతలమ కాశ్యపిఁ బట్టు ఫణీంద్ర భూవిషా
ప్రదులను బట్టు కూర్మమ రసాతలభోగిధులీకులీశులన్
వదలక పట్టు ఘృష్టి ధరణీఫణికచ్ఛపపోత్రివర్గముల్
బొదువుచుఁ బట్టుఁడీ కరులు భూవరుఁడీశునిచాప మెక్కిడున్.

క. ఉర్వీనందనకై రా
మోర్వీపతి యెత్తు నిప్పు డుగ్రునిచాపం
బుర్విం బట్టుడు దిగ్దం
త్యుర్వీధరకిటిఫణీంద్రు లూఁతఁగఁ గడిమిన్. 78

వ. అనుచు లక్ష్మణుండు దెలుపుచున్న సమయంబున. 79

మ. ఇనవంశోద్భవుఁడై నరాఘవుఁడు భూమీశాత్మ*జుల్ వేడ్కతోఁ, దను వీక్షింప మునీశ్వరుం డలరఁ గోదండంబు చేనంది చివ్వన మోపెట్టి గుణంబు పట్టి పటుబాహాశక్తితోఁ దీసినన్, దునిఁగెన్ జాపము భూరిఘోషమున వార్ధుల్ మ్రోయుచుండంబునన్. 80

ఆ. ధనువు దునిమినంత ధరణీశసూనులు
శిరములెల్ల వంచి సిగ్గుపడిరి
సీత మేను వెంచె శ్రీరామచంద్రునిఁ
బొగడె నపుడు జనకభూవిభుండు. 81

వ. ఇట్లు శ్రీరామచంద్రునిసత్త్వసంపదకు మెచ్చి సంతోషించి జనకమహారాజు వివాహంబు సేయువాఁడై రమ్మని దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు వ్రాయించి పంచిన దశరథమహారా

* 'జవ్రాశముల్' అని పాఠాంతరము.

జును నాశుభ లేఖలంజదివించి సంతోషంబున నానంద బాష్పం బులు గ్రమ్ముదేర మంత్రి ప్రవరుండగుసుమంత్రునిం బిలిపించి సుమంత్రా! యిప్పుడు మన మందఱమును బయలుదేఱి మిథిలాపట్టణంబునకుం బోయి యట జనకమహారాజునింట మన రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు వివాహమహోత్సవముజరుప వలయుఁ గావున వసిష్ఠాదిద్విజవర్యులను గౌసల్యాదికాంతా జనమ్మును నరుంధతి మొదలుగాఁగల భూసురభార్యలను మఱియు సకలబంధుజనంబును రావించి బంగరుపటరదంబుల నిడికొని దోడ్కొని రమ్మని యంపిన నతండును మహాప్రసాదంబని తత్‌క్షణమ యంతఃపురంబునకుం బోయి కౌసల్య కైకసుమిత్ర మొదలగురాజకాంతలను వసిష్ఠాదిద్విజవరిష్ఠులను నరుంధతి మొదలుగాఁ గలముత్తైదువలను మిగిలిన సకల బంధుజనమ్మును రావించి యుక్తప్రకారమ్ముగాఁ గనక రథమ్ముల పై నిడికొని దశరథమహారాజుకడకుం గొనివచ్చిన యంతదశరథుండు పుత్రద్వయసహితమ్ముగరథమారోహించి సమస్త సేనాసమన్వితుం డగుచు వాద్యఘోషంబులు దశదిశలునిండ నడచుచున్నసమయమ్మున నంతకుముందు జనకభూవల్లభుండు దశరథమహీపాలు నెదుర్కొని తోడితెచ్చి యడుగులు గడిగి యర్ఘ్యపాద్యాదివిధుల విధ్యుక్తంబుగాఁ బూజించి మానితంబుగఁ గానుక లొసంగి సకలసంపత్సంపూర్ణ మయినసివేశముం గల్పించి యందుఁ బెండ్లివారిని విడియించె నంత నక్కడఁ గనకవికారమైనపీఠమ్ము పైఁ గూర్చున్నసమయమ్మున దేవా! శుభముహూర్తం బాసన్న మగుచున్నది రమ్మని వసిష్ఠుండు సనుదేర నాతఁడు సని రాము

లక్ష్మణభరతశత్రుఘ్నులకు మంగళస్నానమ్ముఁ జేయించి నిర్మలాంబరాభరణంబు లొసంగి వేర్వేఱ నొక్కముహూర్తమ్మునఁ దనకూఁతు సీతను శ్రీరామచంద్రునకును, దన తమ్ముఁడు కుశధ్వజునికూఁతు లగుమాండవ్యూర్మిళాశ్రుత కీర్తులను భరతలక్ష్మణశత్రుఘ్నులకును నిచ్చి వివాహముం జేసి తనప్రియతనయల కొక్కొకలెను నూఱేసి భద్రగజమ్ములను వేయేసితురంగంబులును బదివేలు దాసీజనమ్మును లక్షధేనువులును నరణంబు లిచ్చి దశరథాదిరాజలోకమ్మునకు బహుమానమ్ముగా నవరత్నఖచితభూషణమ్ములును జీని చీనాంబరమ్ములును నొసంగి సుగంధద్రవ్యముల నర్పించి పూజించి యంపె నంత దశరథమహారాజు మరలి యయోధ్యాపట్టణంబునకు వచ్చుచుండఁగా మధ్యేమార్గంబున. 82

ఆ. పరశురాముఁ డడ్డుపడి వచ్చి మీనామ
మెవ్వ రనిన మొలకనవ్వుతోడ
నేను దశరథుండ నితఁడు నాపుత్రుండు
రాముఁ డంద్రు పేరు భీమబలుఁడు. 83

వ. అని వినిపించినఁ గ్రోధావేశవశంవదుం డై యప్పు డప్పరశురాముండు రాముం గనుంగొని యిట్లనియె. 84

క. రాముఁడు నేనై యుండఁగ
నామీఁద నొకండు కలిగెనా మఱి యూఁ గా
కేమాయె రణ మొనర్పఁగ
రామా రార మ్మటంచు రహిఁ బిలిచెఁ దగన్. 85

వ. పిలిచినతోడనే రామచంద్రుం డతని కిట్లనియె. 86

ఆ. బ్రాహ్మణుండ వండు బరమపవిత్రుండ

వదియుఁగాక భార్గవాన్వయుండ
వైననిన్నుఁ దొడరి యాహవస్థలమున
జగడ మాడ నాకుఁ దగునె చెపుమ. 87

వ. అనిన విని పరశురాముం డి ట్లనియె. 88

ఉ. శస్త్రముఁ దాల్చినం దగునె సన్నుతి కెక్కిన బ్రాహ్మణుండనన్
శాస్త్రము గాదు నా కెదిరి సంగరభూమిని నిల్చినంతనే
శాస్త్రముఖంబులన్ నృపులఁ జక్కఁగఁ జేయుదుఁ గాన నిప్పుడున్
శస్త్రము శాస్త్రముం గలవు సాహసవృత్తిని రమ్ము పోరఁగన్; 89

వ. అనిన రామచంద్రుం డి ట్లనియె. 90

మ. విను మావంటి నృపాలురైనఁ గలనన్ వీరత్వముం జూపఁగా
ననయంగాక మహానుభావుఁడవు నిన్నాలంబులో మీఱఁగా
నెనయన్ ధర్మమె మాకుఁ జూడ మఱి నీవేమన్న నీమాటకుం
గనలన్ మంచిది కాదు మాకెపుడు దోర్గర్వంబు మీపట్టునన్.

వ. అనిన విని యెంతయు సంతోషించి భార్గవరాముండు రాఘు
రామునితో నిట్లనియె. 92

ఆ. శివునిచివుకువిల్లు శీఘ్రింబె యానాఁడు
విఱిచినాఁడ ననుచు విఱ్ఱవీఁగ
వలదు నేఁడు నాకు వశమైనయీచాప
మెక్కుపెట్టి తివియు మింతెచాలు. 93

ఉ. రాముఁడు గీముఁ డంచును ధరాజనులెల్ల నుతింప డిట్టవై
భీమునిచాపమున్ విఱిచి ప్రేలెద వందుల కేమిగాని యీ
శ్రీమహిళేశు కార్ముకముఁ జేకొని యెక్కిడు దేని నేఁడు నీ
తో మఱి పోరు సల్పి పడఁ ద్రోతు రణస్థలి నీశరీరమున్. 94

చ. అని తనచేతివిల్లు నృపులందఱుఁ జూడఁగ నందియీయ నా

ధనువునుగూడి తేజముఁ బ్రతాపమురామునిఁజెందె నంతనే
జనవరుఁ డాశరాసనముఁ జక్కఁగ నెక్కిడి వాఁడిబాణ మం
దునిడియేదిలక్ష్యమనఁ ద్రోవలుసూపినఁ ద్రుంచె గ్రక్కునన్.

వ. ఇట్లు మహాప్రతాపంబున నావిలు ద్రుంచి యనర్గళప్రతాప
మ్మున భార్గవరాముదోర్గర్వంబు నిర్గర్వంబు గావించి జయ
మ్ముఁ గైకొన్నకుమారునిం గౌఁగిలించుకొని దశరథుండు
కుమారచతుష్టయమ్ముతో నయోధ్యానగరంబుఁ బ్రవేశించి
సుఖోన్నతి రాజ్యంబు నేలుచున్న సమయంబున. 96

శా. పారావారగభీరికిన్ ద్యుతిలసత్పద్మారికిన్ నిత్యవి
స్మారోదారవిహారికిన్ సుజనరక్షాదక్షుదక్షారికిన్
సారాచారవిచారికిన్ మదరిపుక్ష్మాపాలసంహారికిన్
వీరా సాటి నృపాలకుల్ దశరథోర్వీనాథజంభారికిన్. 97

వ. అని కొనియాడఁ దగిననృపాలశేఖరుఁడు ధర్మమార్గంబు
నొక్కింతయేనిఁ దప్పకుండ రాజ్యంబు సేయుచుండె ననుట
విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుం డటమీఁదికథా
విధానం బెట్టి దని యడుగుటయు. 98

క. జలజాక్ష! భక్తవత్సల!
జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర
జలజాకరచారుహంస! జానకినాథా! 99

గద్యము. ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చన
వినోద సూరిజనవినుతకవితాచమత్కారాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్ల నామధేయవిరచితం బైనశ్రీరామాయణమహా
కావ్యంబునందు బాలకాండము సర్వము నేకాశ్వాసము.

---

# అయోధ్యాకాండము

క. కందర్పరూప! ఖండిత
కందర్పవిరోధిచాప! కరుణాద్వీపా!
వందితశుభనామా! ముని
సందోహస్తుత్యభూమ! జానకిరామా! 1

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహాముని కెఱింగించిన
తెఱంగు వినిపించెద నాకర్ణింపుము. 2

సీ. తనసుమంత్రాదిప్రధానులతోఁ గూడి
సుఖగోష్ఠి నుండఁగ నఖిలజనులఁ
జక్కఁగా రావించి సమ్మదంబున వంశ
గురువుతో దశరథధరణినాథుఁ
డనియె నీభూభార మంతయు నొక్కఁట
నేలితిఁ జాలదె యేకహేళి
నటుఁగాక పగతుర నవలీల గెల్చితి
నిల్పితి ధర్మము నిష్ఠతోడ

తే. నింత చాలదె యాశకు నెంత కెంత
రామచంద్రుని ధరణికి రాజు గాఁగ
మీరు సూడంగఁ బట్టంబు భూరిమహిమఁ
గట్టవలయును మంచిలగ్నమునఁ జెలఁగి. 3

తే. అనుచు గురునకుఁ జెప్పి తా నతనిసమ్మ
తమున సౌభాగ్యమంగళద్రవ్యసమితిఁ
గూర్చుఁ డనుచును మంత్రులకును నెఱుంగఁ
జెప్పి శృంగార మీపురిఁ జేయుఁ డనియె. 4

వ. అట్టిసమయంబున. 5

తే. పగలు ప్రాగ్భాగమున నుండి గగనవీథిఁ
జరమదిక్కున కేఁగఁగాఁ శ్రమము దోఁచి
చెమట పట్టిన స్నానంబుఁ జేయ నరుగు
కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె. 6

క. మేలిమి సంధ్యారాగము
ప్రాలిన చీఁకటియుఁ గలిసి వరుణునివంకన్
నీలముఁ గెంపును నతికిన
పోలికఁ జూపట్టె నట నభోమణి తలఁగన్. 7

క. వారక కల్పద్రుమమున
గోరకములు పుట్టినట్లు గురుతర కాంతిన్
దారకములు తల సూపెన్
జోరానీకమ్ము మిగుల స్రుక్కుచు నుండన్. 8

ఆ. కారుమొగులురీతిఁ గాటుకచందాన
నీటిభాతి నింద్రనీలమహిమ
మాషరాశిపోల్కి మఱి మఱి యప్పు డంధ
కార మవని యెల్లఁ గలయఁ బర్వె. 9

వ. అట్టిసమయంబున. 10

చ. తలవరులన్ నిజాధిపుల దర్పకునేర్పునఁ గన్నుఁ బ్రామి య
త్తలఁ దముపిన్నపాపల నుదారత నేర్పడ నిద్రపుచ్చి ని
ర్మలకరకంకణావళులు రట్టుగ దా మటు మ్రోఁగనీక వి
చ్చలవిడిగాఁ జరించి రొగి జారలతాంగులు మధ్యరాత్రులన్.

చ. సురతము లేక యుస్సురనుజోటిమగండుడికించు కాంతయున్
సరస మెఱుంగుచంద్రముఖి సావడిదంటయు బేరకత్తెయున్

బరపురుషాభిలాషమును బాయనిభామిని పోరుకట్టునన్
బరఁగినభామలాది యుపభర్తలఁ గూడి చరించి రత్తఱిన్.

ఉ. భానుసహస్రసత్కిరణపంక్తుల నుద్భవ మైనయాబృహ
ద్భానునివెట్టఁ బెల్లుడకఁబడ్డసుధాంబుధి మీఁదిమీఁగడల్
పూని సమీరుచేఁ దెరల పూర్వదిశం గనుపట్టె దానిపై
ఫేన మనంగ నొప్పె శశిబింబము తూరుపుఁగొండపైఁ దగన్.

చ. కుముదములుం జకోరములుఁ గోమలసస్యముఁ జంద్రకాంతము
రమణఁ జెలంగ వెన్నెల తిరంబుగఁ జేసె జగంబులుబ్బఁగాఁ [ల్
గమలములున్ వియోగులధికంబుగఁ జోరులుఁ జక్రవాకముల్
రమణఁ గలంగ వెన్నెలతిరంబుగఁ గాచె జగంబు లుబ్బఁగాన్.

ఉ. నారదు లైరి సన్మునులు నాకమహీజము లయ్యె భూజముల్
శారద లైరి భామినులు శంకరశైలము లయ్యె గోత్రముల్
పారద మయ్యె నీరధులు పన్నగనాయకు లయ్యె నాగముల్
వారిదవర్గ మెల్ల సితవర్ణము లయ్యెను బండువెన్నెలన్. 15

చ. కొడు కుదయించె నంచలరి కోరిసుధాంబుధి మిన్నుముట్టియ
ప్పుడుజగ మెల్లఁగప్పెనఁ బూర్ణతనొం దెనుసాంద్రచంద్రికల్
పుడమికిఁ బాలవెల్లిగతిఁ బొల్పెసలారఁగఁ జంద్రుఁడొప్పె
య్యుడుపతిమేనిమచ్చయనునొప్పెఁ బయోనిధిపద్మనాభుఁడై.

వ. అట్టిసమయంబున.

ఉ. కోరి చకోరదంపతులు గుంపులుగుంపులు గూడి రంతులన్
జేరిన చంద్రికారసముఁ జేర్కొనిమార్కొనిపొట్టనిండఁగా
బారణసేసి పెన్బయలఁ బ్రాఁకుచుఁ జంచుపుటంబు లెత్తుచున్
జేరెము వారుచుండె మదిఁ బ్రేమ జనింప వధూటికోటికిన్

ఉ. వెన్నెలతీఁగలన్ గొనలు వేడుకముక్కులఁ ద్రుంచి తెచ్చిదా
త్కొన్నప్రియాంగనాతతికిఁ గూరిమి నోరికి నిచ్చి కేళికిన్

సన్నపుఁగంఠనాళముల సన్నలు సేసి సుఖించె నింపుగన్
దిన్ననిచంద్రకాంతమణితిన్నెలమీఁదఁ జకోరదంపతుల్. 19

తే. పాకశాసని సేవంతిబంతి దివికి
నెగుర వైచినకైవడి నేమి చెప్పఁ
బాండువర్ణంబుతోఁ బూర్వభాగమందు
సొంపు మీఱంగ వేగురుఁజుక్క వొడిచె. 20

వ. అట్టిసమయంబున. 21

క. రవి యుదయించెను జనుఁడీ
దివియలు నక్షత్రసమితి తిమిరము శశియున్
బవ లేమిటి కనురీతిని
గువలయమున గూళ్లఁ గోళ్లు గూయ మొదలిడెన్. 22

చ. వదలక పద్మరాగమణి వట్రువ గ్రాలఁగఁ బట్టి నేర్పు పెం
పొదవఁగఁ దూర్పుకొండపయికొప్పుగఁ దెల్చిజగద్గురుండు దాఁ
త్రిదశవరేణ్యుకట్టెదురఁ దేఁకువ నిల్పినదర్పణంబు నా
నుదయము నొందె భానుఁడు సముజ్జ్వలకోకనదప్రదీప్తులన్.

వ. ఆరాత్రి రాజశేఖరుని చిత్తంబు వచ్చునట్టుగా మెలంగి
యాతఁడు దన్ను మెచ్చు టెఱింగి కైక యిట్లనియె. 24

ఆ. వసుమతీశ! నాకు వర మిచ్చి తప్పుట
తగవు గాదు మీకుఁ దలఁపులోన
మఱచినారదేమొ మన్నించి తొల్లింటి
యీవు లీయవలయు నీక్షణంబ. 25

క. జననాథ! నాకుమారుని
వినుఁడీ పట్టంబు గట్టి వేవేగను రా
ముని మునిఁగా ననుపుఁడు మఱి
వనమునఁ బదునాలుగేండ్లు వర్తింపంగన్. 26

వ. అని ప్రార్థించిన విని పార్థివేంద్రుండు డిల్లపడి తల్లడిల్లుచు నుల్లంబు గలంగి మునుంగిడి యచ్చేడియ పలికినపలుకులకు మాఱాడ నోడి మిన్నక యున్నసమయంబున సుమంత్రుం డేతెంచి స్వామీ! రామచంద్రునిఁ బట్టంబు గట్ట సుముహూర్తం బాసన్నం బయ్యెఁ గావున మిమ్ము నచ్చటికి విచ్చేయ నవధరింపుం డని వసిష్ఠభగవానుండు విన్నవించు మని పంపె నని చెప్పిన విని కైక యి ట్లనియె. 27

మ. అనిలోమున్నునృపాలుచిత్తమునకే నాహ్లాదముంగూర్చి నా
తనయుంబట్టముగట్టి రాఘవుని బద్ధాగ్లేంద్రకాంతారమం
దుసువర్తిల్లఁగఁబంపఁగోన్నవరమున్ ద్రోయంగ రాదెంతయు
న్వనసీమన్మునివృత్తినుండుమనుఁడీవైళంబ యారామునిన్.

క. అని పలుకు కైకపలుకులు
విని వేగమ మరలి వచ్చి విన్నదనంబున్
దనుక వసిష్ఠునితోడన్
వినుపించె సుమంత్రుఁ డట్టివిధ మేర్పడఁగన్. 29

వ. అనిన విని వసిష్ఠాదిప్రముఖులును సుమంత్రాదిప్రధానజనంబులును సైన్యంబులును బరివారంబులును విన్ననై యున్న నాసన్నయెఱింగి రామచంద్రుండు రాజచిహ్నంబులు త్యజించి జటావిభూతివల్కలంబులు దాల్చి ధనుర్ధరుం డై యున్నంత లక్ష్మణుండు భూపుత్రికయును దోడం జనుదేరఁ దల్లులకు నమస్కరించి వసిష్ఠానుమతంబున నాశీర్వచనంబులు గైకొని యాస్థానంబు వెలువడి యరణ్యంబున కరుగునప్పుడు పురజను లందఱును బురపురం బొక్కుచు దశరథమహారాజును దూషించుచుఁ గైకను నిందించుచు మూఁకలై శోకించుచుండ నది యంతయు విని దశరథుండు పురోహితామాత్యబంధు

వర్గంబులతో శ్రీరామచంద్రుం డేగిన త్రోవం జన్నంత నా
రాముఁడు దూరంబునం జనియె దశరథుండును మరలి వచ్చి
పుత్త్రశోకంబున నాకపురంబునకుం జనియెఁ దదనంతరంబ. 30

ఆ. చనుచు రాఘవుండు స్వర్ణదియొడ్డున
గుహునిఁ గాంచి యతనిఁ గుస్తరించి
తడయ కోడఁ బెట్టి దాఁటింపు మనవుడు
నట్లు చేయఁ దలఁచి యాత్మలోన. 31

చ. సుడిగొనిరాముపాదములు సోఁకినధూళివహించి రాయి యే
ర్పడ నొకకాంత యయ్యెనఁట పన్నుగ నీతనిపాదరేణు వి
య్యెడ వడి నోడసోఁక నిది యేమగునోయనిసంశయాత్ముఁడై
కడిగెగుహుండు రామపదకంజయుగంబుభయమ్ము పెంపునన్.

వ. ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీపాదంబుల నీటఁ గడిగి యోడపై
నెక్కించి యమ్మువ్వుర నవ్వలికి దాఁటించిన నాక్షణంబ. 33

ఉ. రాజకులావతంసుఁ డగు రాముఁడు తమ్ముఁడుఁ దాను నాభర
ద్వాజమహామునీంద్రపదవారిజముల్ గని మ్రొక్క నాతఁడం
భోజహితాన్వయాబ్ధిపరిపూర్ణసుధాకరుఁ డైనరామునిం
పూజ లొనర్చి కందఫలమూలములం బరితృప్తుఁ జేసినన్. 34

వ. సంతసించుచు నారాత్రి యచ్చట నివసించి మఱునాటిదిన
మర్కోదయమ్మున. 35

ఆ. ముదముతోడఁ దమ్ము మునిభరద్వాజుండు
భక్తి ననుప రామభద్రుఁ డపుడు
చనియె భ్రాతృదారసహితుఁ డై సన్ముని
కూటమునకుఁ జిత్రకూటమునకు. 36

మ. ఘనుఁ డా రాముఁడు చిత్రకూటమున వేడ్కం జేరియున్నంతలో
నన దంతావళవాజిరత్నరథనానా యోధసంఘంబులో

డ నమాత్యద్విజబంధువర్గములతోడం గూడి వాద్యంబులం
జను దెంచెఁ భరతుండు శ్రీరాముకడకుఁ సద్భక్తియేపారఁగన్.
సీ. చను దెంచి రాముని చరణంబులకు మ్రొక్కి
కైకేయి చేసినకపటమునకు
నగరంబు విడిచి యీపగిది ఘోరారణ్య
మున కిట్లు రానేల మునులపగిది
నది గాక మనతండ్రి యత్యంత మైనట్టి
పుత్రశోకంబునఁ బొక్కి పొక్కి
త్రిదశాలయమ్మున దేవేంద్రుఁ గనఁ బోయె
నని చెప్ప విని రాముఁ డంతలోన
తే. భరతలక్ష్మణశత్రుఘ్నధరణిసుతలఁ
గూడి దుఃఖించి దుఃఖించి కొంతవడికి
నాప్తవర్గంబుచే మానె నంతమీఁద
భరతుఁ డిట్లనె శ్రీరామభద్రుతోడ.
తే. రాజు లేకున్నచో మఱి రాష్ట్రమందుఁ
గార్య మెట్లౌను మీ రెఱుంగనిది గలదె
నేఁటిసమయానఁ బట్టంబు నిలుపుకొనఁగఁ
దిరిగి విచ్చేయుఁ డనుడు నాభరతుతోడ. 39
వ. శ్రీరామచంద్రుం డి ట్లనియె. 40
చ. జనకుఁడు నేసినట్టిమితిఁ జక్కఁగఁ దీర్చి కడంక నేను వ
చ్చినగుఱిదాఁక భూతలము జేకొని రాజ్యముఁ జేయుమాటగా
దనకు మటన్న నొల్ల నన నాతనికిం దనపాదుకాయుగం
బొనరఁగ నిచ్చి పొమ్మనుచు నుర్వికి రాజుగఁ బంచె సొంపుగన్.
వ. ఇట్లు భరతుని 'భరతాగ్రజుం డనునయించి మరలించి నాక
లోకకవాటం బగుచిత్రకూటంబు కదలి సౌమిత్రిభూపుత్త్రి

లం గూడి పోవునెడ నటవీమధ్యంబున విరాధుం డను దైత్యాధముం డపరాధంబుచేసి డిగ్గన డగ్గఱి జగతీతనూ భవనెత్తుకొని గగనమార్గంబున కెగిరిపోవునెడ వాఁడిబాణం బున వానికంఠంబును ద్రుంచి గారుడాస్త్రంబున మరల నొయ్యన జనకనందనుం డించి భయంబు వాపి ప్రియంబు సూపి యొయ్యనొయ్యన నయ్యెడ నున్నయత్రిమహాముని యాశ్రమంబునకుం జని ఘనంబున నాఘనుండు సేయు పూజలం గైకొని రామచంద్రుం డచ్చటిమునీంద్రులకు దైత్యులవలనిభయంబు లేకుండ నభయం బిచ్చి మన్ననం గొన్నిదినంబు లాయామునులయాశ్రమంబున నిలుచుచు వార లనుప శరభాదిమృగోత్కరశరణ్యం బగునరణ్యంబుఁ జొచ్చిపోయె నని చెప్పిన విని నారదుని వాల్మీకిమునీంద్రుం డటుమీఁదికథావిధానం బెట్టి దని యడుగుటయు. 42

క. జలజాక్ష! భక్తవత్సల!
జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర!
జలజాకరచారుహంస! జానకినాథా! 43

గద్యము. ఇది శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చన వినోదసూరిజనవినుత కవితాచమత్కారాతుకూరికేసనసెట్టి తనయ మొల్లనామధేయవిరచితం బైన శ్రీరామాయణ మహాకావ్యంబునం దయోధ్యాకాండము సర్వము నేకా శ్వాసము.

# ఆరణ్యకాండము

క. మునిదత్తధనుర్వేదా!
మునినాథప్రియసతీసుపూజితపాదా!
జనకార్చితగుణధామా!
సనకాదిస్తవ్యనామ! జానకిరామా! 1

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెఱంగు విని
పించెద. 2

చ. ఇతనికిఁ బాదచారితన మేటికి వచ్చెనొ పట్టభద్రుఁ డీ
సతి నవరూపరేఖలను జక్కని దయ్యును నిట్టిదుర్దశల్
ప్రతిపసియించునెట్లొ రతిరాజసమానుల వీరి నేల యీ
గతిఁబడఁ ద్రోచెబ్రహ్మ యని కాంతురు చెంచెత లమ్మహాత్ములన్.

సీ. నడువ నేరనికొమ్మ యడుగులు పొక్కులై
శర్కరస్థలముల శ్రమముఁ జెందె
వీచినచేతుల వ్రేళ్లు నెత్తురు గ్రమ్మి
పొటమర్లు కెంపులపోల్కి నమరె
వడిగాలి సుడివడి వాడిన లేఁదీఁగ
భావంబునను మేనిచేవ తఱిగెఁ
బూర్ణచంద్రునికాంతి పున్నమ వేకువఁ
గనుపట్టుగతి మోము కళల విడిచె

తే. ధవుని నడుగడుగునకుఁ గైదండఁ గొనుచు
నెగడుడప్పిని నిట్టూర్పు లెగసి చిగురుఁ
బెదవు లెండఁగ నీడకు నుదిల గొనుచు
మనసులోఁ జేవ యూఁతగఁ జనెడువేళ. 4

వ. ఇట్లు సీతయు రాముండును సత్యఋషింబోని సౌమిత్రియుఁ
గతిపయ ప్రయాణంబులఁ బంచవటికిం జని సంతోషభరి
తాంతరంగులై. 5

క. అచ్చటఁ గొన్ని దినంబులు
ముచ్చటపడి యుండఁ దలఁచి మునిముఖ్యులచే
మచ్చికఁ దమ్ముఁడు దానును
గ్రచ్చుఱ నొకపర్ణశాలఁ గావించి తగన్. 6

ఆ. అందు రామచంద్రుఁ డనుజన్ముఁడును దాను
గొన్ని వాసరంబు లున్న వేళ
వికృతవేషధారి వేవేగ నటఁ జొప్ప
నాక యనెడిదైత్యనారి యొ___ర్తు. 7

వ. రామునిఁ గని ప్రేమాభిరామం బగుమనంబునఁ దన్నుఁ
గామించి రమ్మనిన రామచంద్రుండు సౌమిత్రినిం జూప నతఁ
డు మున్ను మాయన్న నభిలషించుటం జేసి నాకు దోషంబు
గాన నీ వారామునికడకు మరలఁ జను మన్న నది యట్ల
చేసిన రామచంద్రుండును దిరుగ లక్ష్మణుం జూపినఁ గోపించి
యారాక్షసి మనుజేంద్రసూనుల దండింపం దలంచిన నెఱింగి
భరతానుజుండు దానినాసికాకర్ణంబులు గోసివైచిన నది
నెత్తురు జొత్తిల్లఁ బసిపాపయుంబోలి యేడ్చుచు ఖరదూష
ణాదిసోదరులకుం జెప్పిన వారు గనలి రాక్షణంబున. 8

క. పదునాల్గువేలదైత్యులు
మదమున సోదరులు గొల్వ మండుచు శూరా
స్పద మగురథనికరముతోఁ
గదనంబున రాముకడకు ఖరుఁ డేతెంచెన్. 9

ఆ. ఖరుఁడు వచ్చినట్టికలకలం బాలించి
రాఘవుండు దనదురమణియొద్దఁ
దొలఁగ నుండ ననుజుఁ దోడుగాఁ గాఁ పుంచి
బెదర కంతఁ గలని కెదిరి నిలిచె. 10

శా. ఆవేళన్ ఖరుఁ డుగ్రవృత్తి లయకాలాభీలఘోరాకృతుల్
దైవారన్ గజవాజిసంఘములతో దైత్యాళితో భూరిరో
షావిర్భూతమనస్కుఁ డై నడిచె ; గర్వారంభసంరంభుఁడై
దేవవ్రాతము భీతిఁ బొంది కలఁగన్ దేజంబు సొంపారఁగన్.

వ. ఇట్లు ఖరుండు సనుదెంచి భయంకరంబుగా రణంబు సేయు సమయంబున. 12

ఉ. అప్పుడు రామచంద్రుఁడు భయంకరరౌద్రరసంబుకన్నులన్
నిప్పులు రాల్చుచున్ నెరయ నిర్జరులార్వ విచిత్రశస్త్రముల్
కుప్పలు గాఁగ నేయుచును గుంజరవాజిరథావళుల్ ధరన్
దప్పక కూల్చుచున్ రుధిరధారలఁ దేల్చె సురారిసంఘమున్.

వ. అట్టిసమయంబున. 14

క. కరితురగస్యందనములుఁ
బరివారము దెగినపిదపఁ బటురోషమునన్
గరకరపడుచును నెదిరిన
ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరునిశిరంబున్. 15

వ. త్రుంచినం గని తీండ్రంబుగా. 16

క. ఘోషించి రామచంద్రుని
దూషించుచు వచ్చినట్టిదూషణుమీఁదన్
రోషించి సురలు కడు సం
తోషింపఁగ వానికరముఁ ద్రుంచెఁ గడంకన్. 17

ఆ. త్రిశిరుఁ డంతఁ గనలి దివ్యాస్త్రసంపద
రాముమీఁదఁ జూపి రణ మొనర్చె
మూఁడుశరము లతఁడు ముదలించి యట వాని
మూఁడుతలలఁ ద్రుంచె మొగ్గరముల. 18

వ. ఇట్లు ఖరాది రాక్షసుల శిక్షించి జయంబు గొని ధను వెక్కు-
డించి మరలి పర్ణశాల కేతెంచి తమ్ముఁడును దానును సమ్మ-
దంబునం గలిసి యున్నసమయంబున. 19

చ. చలమున నంత శూర్పణఖ సయ్యన లంకకు నేఁగి రావణుం
గొలువునఁ గాంచి మ్రొక్కి తనకుఁ నృపసూనులు సేసినట్టిచేఁ
తలు వినుపించి వారు తమతండ్రియనుజ్ఞను వచ్చి కానలో
పలఁ దిరుగాడుచందములుఁ బన్నుగ నేర్పడఁ జెప్పి పిమ్మటన్.

క. ఆరాముభార్యవిభ్రమ
మేరాజతనూజలందు నెఱుఁగము విని మఱి
ధారుణిలోపలఁ గామిను
లారమణికి సాటిఁ బోల రభినుతిఁ జేయన్. 21

సీ. కన్నులు గలువలో కాముబాణంబులో
తెలివిగా నింతికిఁ దెలియరాదు
పలుకులు కిన్నెరపలుకులో చిలుకల
పలుకులో నాతి కేర్పఱుపరాదు
అమృతాంశుబింబమో యద్దమో నెమ్మోము
తెంపుతోఁ జెలికి భావింపరాదు
కుచములు బంగారుకుండలో చక్రవా
కమ్ములో చెలి కెఱుగంగరాదు
తే. కురులు నీలంబులో తేఁటిగుంపు లొక్కొ
పిఱుదు పులినంబొ మన్మథు పెండ్లియరుఁగొ

యనుచుఁ గొందఱు సంశయం బందుచుండ
వెలఁది యొప్పారు లావణ్యవిభ్రమముల. 22

క. కలదో లేదో యనుచును
బలుమఱు నెన్నడుముఁ జూచి పలుకుదు రితరుల్
బలిమో కలిమో యనుచును
బలుమఱు జఘనంబుఁ జూచి పలుకుదు రితరుల్. 23

సీ. షట్పదంబులపైకి సంపెంగపువ్వుల
జలజాతములపైకిఁ జందమామఁ
గిసలయంబులపైకి వెసఁ గలకంఠముల్
సింధురమ్ములపైకి సింహములను
దొండపండులపైకి దొడ్డరాచిలుకల
నలరుఁదూఁడులపైకి హంసవితతిఁ
బండువెన్నెలనిగ్గుపైకిఁ జకోరముల్
పవనంబుమీఁదికిఁ బాపఱేని

తే. మరుఁడు వైరంబు చేసినమాడ్కి నలక
నాసికాకరాననచరణస్వనములు
వరపయోధరమధ్యోష్ఠవచనబాహు
గమనహాసాక్షు లూర్పారు రమణి కమరె. 24

క. బంగారు నీరు నిలువునఁ
బొంగారుచు నుండ నజుఁడు వోసినమాడ్కిన్
శృంగార మెల్ల నిలువునఁ
బొంగారుచు నుండఁ గరఁగి పోసినమాడ్కిన్. 25

వ. అట్టిదయోరూపంబులను గనుపట్టునట్టియ క్కాంతారత్నంబు నీకు సిద్ధించె నేని నీవు త్రిభువనంబులు విజయంబుచేసిన యంతకన్నను సంతసింతు వన్న విని కామాశుగంబులం

దగిలి కామాంధుండై కన్నులు గానక యున్నకొని తన్నుఁ
దా మఱచి యొడ్డోలగంబు పాలించి పుష్పకం బనువిమాన
రత్నంబుపై నధిష్ఠించి మారీచుకడకుం జని ప్రార్థించి నీవు
కనకమృగంబ వై జనస్థానంబునకుం జని దశరథనందనుం
డగుశ్రీరాముం డున్నపర్ణశాలకడం బొడకట్టిన నతండును
నిన్ను వెనుకొను నీవు నతని నతిదూరంబుగాఁ గొనిపోయి
మాయంబైన నేను రామునిభార్యం గొనివత్తు ననిన విని
స్మృతిలక మాఱుత్తరం బిచ్చిన రావణుం డుగ్రుండై మండి
పడ నతం డాసన్నయెఱింగి కనకమృగరూపంబును దాల్చె
నాక్షణంబున.

క. ఒడ లెల్లను బంగారము
పొడ లెల్లను రత్నసమితి బోలిన మెఱుపుల్
నడ లెల్ల నెఱపి మెలఁగెడు
కడ లెల్ల విలాసరేఖ కళలందొప్పెన్. 27

వ. ఇట్లు కనకమృగాకారంబు గైకొని పర్ణశాలకడకుం బోయి
మెలంగునప్పుడు. 28

క. కనియును వినియును నెఱుఁగము
కనకమృగం బనుచు వేడ్క గడలుకొనంగన్
గనఁగ మృగం బద్భుత మిది
కనకమృగం బేమిసేయఁ గలదో మీఁదన్. 29

వ. అని కనుఁగొన్న మునిజనంబులు మనంబులం దలంకునెడ
నామృగంబును మృగనేత్రయగుధాత్రీపుత్రి గని దాని నభి
లషించిన నాసన్న యెఱింగి సౌమిత్రిని భూమిజకుం దోడిడి
శ్రీరామచంద్రుండు దానివెనుకొని చనుచున్నయవసరమ్మున.

సీ. తనుఁ బట్టఁ నొయ్యన వెనుకొని చనుదెంచు
నిలతేనితలఁపు దాఁ దెలిసి తెలిసి
చేరువ మెలఁగుచుఁ బారి మేయుచు డాసి
మెల్లన యంతంత మెలఁగి మెలఁగి
తననీడఁ గనుఁగొని తానె దిగ్గన దాఁటి
భయమునఁ బరువెత్తి పఱచి పఱచి
యెడ దైనఁ బోవక యెలయించి కనుఁగొన్నఁ
దరువుల నొయ్యన నొరసి యొరసి
తే. చెవులు నిక్కించి చూచుచుఁ జెలఁగి చెలఁగి
పోవ రాముండు దవ్వుగాఁ బోయి పోయి
యెలమి మాయామృగం బని యెఱిఁగి మదిని
దీనిఁ జంపుదుఁగా కని తెగువ చేసి. 31

క. ఏచినకినుకను బలునా
రాచము సంధించి డాసి రాఘవుఁ డామా
రీచుని దైత్యాధముఁ గుల
నీచునిఁ గూలంగ నేసె నిర్జరు లలరన్. 32

వ. వాఁడునుం గూలునవ్వేళ "హా! లక్ష్మణా!" యనురవంబుం జేసిన నాధ్వని విని జనకనందన మనంబున నులికి లక్ష్మణుం బిలిచి మీయన్న కేమి కీడు వాటిల్లెనో కాని నిన్నుఁ దలంచె నీవునుం బోయి మీ యన్నకుశలస్థితిం దెలిసికొని రమ్మనిన నతండు తలంకక నామెతో నిట్లనియె. 33

ఉ. ఏమిటి కింతభీతి మది నీవగ తోఁచుట యేమి నీకు నో
భామిని రామునందు నొకభారము చెందదు చెందెనేనియుఁ
భూమి వడంకదే నభము బోరన మోయదె వార్ధు లింకవే
తామరసాప్తసోమగ్రహతారక లెల్లను నేల డుల్లవే. 34

ఉ. అంత ప నయ్యె నేని దనుజాంతకు నంతకు మన్మథాంతకుఁ
బంతము మీఱఁగాఁ గలఁచి పన్నగమర్త్యసురేంద్రలోకముల్
బంతులు గట్టి యాడ్చి రిపుభంజను రాముని గందకుండ న
ర్పింతును నీకుఁ దెచ్చి మది భీతిని బొందకు మమ్మ జానకీ. 35

వ. అని లక్ష్మణుండు పలికిన విని జనకరాజనందన కినిసి వినరాని మాటలం దూలనాడిన మనంబునం గంది కుందుచు శ్రీరామచంద్రుం డేగినమార్గంబునన చనియె నంత నిక్కడ. 36

క. సన్న్యాసివేష మలరఁగ
నన్యాయము తలఁచుకొనుచు నసురేంద్రుఁడు దాఁ
గన్యారత్నముఁ గని సా
జన్యమునన దీవన లిడె శాంతము దోఁపన్. 37

క. దీవించుడు మునియే యని
భావింపుచుఁ జేర వచ్చుభామిని నపుడా
రావణుఁడు రథముమీఁదికి
వేవేగమ తిగిచి గగనవీథినిఁ జనియెన్. 38

వ. అయ్యవసరంబున. 39

ఆ. అసుర గొంచుఁ బోవ నవనీతనూభవ
వెఱచి పలికె దిశలు వినఁగ నంత
సీత నాదు పేరు శ్రీరామభార్యను
నన్నుఁ గావరయ్య మిన్న కిపుడు. 40

వ. అని మఱియును. 41

ఆ. దేవగణములార! దిక్పాలవరులార!
వృక్షజాతులార! పక్షులార!

కుటిలదానవుండు గొంపోవుచున్నాఁడు
కరుణతోడ నన్నుఁ గావవయ్య. 42

ఆ. అనుచుఁ బలుకుచున్న నాయార్తనాదంబు
విని జటాయు వనెడివిహగనాథుఁ
డరుగుదెంచి కలహ మత్యుగ్రముగఁ జేయ
రావణుండు బక్షిరాజుఁ దాఁకె. 43

చ. అసురవిభుండు వైచునిశితాస్త్రముఖంబులనొచ్చి పక్షియుఁ
గొసరకదైత్యనాయకునిగుండెను నొవ్వఁగఁ దన్ను నంతలోఁ
గసరి నిశాచరుండు కరఖడ్గముఁ ద్రిప్పుచు బక్షయుగ్మముఁ
వసుధఁ బడంగఁ ద్రుంచి కడువైళమ లంకకు నేఁగునత్తఱిన్.

క. వనచరు లోకగిరిచేరువ
వనమునఁ జరియింపఁ జూచి వసుధాసుతయుఁ
దనచీరకొంగుతునుకను
దనసొమ్ములు మూటగట్టి ధరపై వైచెన్. 45

క. అంతట దైత్యుఁడు లంకకుఁ
బంతముతో నేఁగి శింశుపాతరుక్రిందన్
సంతసమున నిడి దానవ
కాంతల నవనిజకుఁ దోడు కావలి యుంచెన్. 46

ఉ. అత్తఱి రాఘవుండు తను నాసలఁ బెట్టుచుఁగొంచుఁబోవఁగాఁ
జిత్తము నొచ్చి యామృగము శీఘ్రమునం బడనేసి దానిమై
తిత్తిని దీసి వింటికొనఁ దెచ్చెడివేళఁ బయోజమిత్రవం
శోత్తముఁడుల్కఁగానఁబడెనొక్కెడలక్ష్మణుఁ డన్నదృష్టికిన్.

చ. పొడగని గుండెఝల్లుమన బుద్ధిఁ గలంగుచు రామచంద్రుఁడ
య్యెడఁ గడు నుగ్రుఁడై పలికె నీవిటు నాకడ కేల వచ్చిత

